చూరఁగా వాఁడు రక్షింప సమర్థుఁడయ్యు వానిని రక్షింపక యూరక చూచుచునుం డునేని, దానిచే వాఁడు తనశత్రువుచేత నాశమునొందినయెడల, ఆ రక్షింపనివాని యనాదికాల సంచితమయిన సుకృతమునంతయుఁ దాను దీసికొని, వాఁడందులకు ఫలముగాఁ బొందవలసిన యుత్తమలోకమును తాను బొందును. ఇట్లు శరణాగతుని రక్షింపనియెడల గొప్పదోషము గలుగునుజుమీ. అట్లు రక్షింపకుండుట స్వర్గవిరుద్ధమై నరకమునకు హేతువగును; ముందనేకుల రక్షించి సంపాదించిన యశస్సునెల్ల నశింపఁజేయును; శరీరమున బలవీర్యము లుండియును రక్షింపనిచో ఆబలవీర్యములను నాశము సేయును'. *కాఁబట్టి కండువు సకలలోకాదృతముగా ప్రశంసాదులు లేక యథార్థమైనదిగాఁ జెప్పిన యాయుత్తమ వచనమును జేసెదను. ఏలనఁగా నది పాపముల నివర్తింపఁజేయునది; ఆనృశంస్యమను పరమధర్మముతోఁ గూడినది; లోకు లెల్లరచేతను కీర్తి గలిగించునది; ఫలము నొసంగుకాలమున స్వర్గము నొసఁగునట్టిది. ఇట్లు ఐహికాముష్మికశుభములు రెండు నొసంగునది గానఁ జేయఁదగినది. †ఒక్కమాఱు

లోకములను తాను బొందును. 'తస్యారక్షిణః' అనుపాఠమున 'యః కశ్చిద్వ్యాం కంచిచ్ఛరణ ముపాగతః' ఎవఁడు ఎవనిని శరణుఁబొందినాఁడో, 'తం' 'వానిని' అని యధ్యాహార్యము, (అరక్షిణ స్తస్య పశ్యతః) రక్షకుఁడుగా వరించియు రక్షింప సమర్థుఁడయ్యు వాఁడు రక్షింపక యూరక చూచుచుండునేని, అట్టు ఆరక్షకుఁడు రక్షింపనందుననే ఆశరణాగతుఁడు, తన శత్రువువలన నశించినవాఁ డగునేని, (తస్య సుకృతం) ఆరక్షింపనివానిని సంబంధించిన యనాదికాలసంచితమగు సుకృతము సర్వమును, ఆశరణాగతుఁడు తీసికొనిపోవును. రక్షింపనివాఁ డార్జించిన సకలసుకృతమును క్షయించినదగు ననిభావము.

*దీనిని చేయకపోవుటచే ప్రత్యవాయము బహుళముగాఁ గలుగుటయేకాక చేయఁగా ఐహికాముష్మికశ్రేయములు పెక్కులు గలవనియు కండువు చెప్పినందులకు తాత్పర్యమని రాముఁడు తానే చెప్పుచున్నాఁడు. 'కరిష్యామి యథార్థంతు కణ్డోర్వచన ముత్తమమ్। ధర్మిష్ఠంచ యశస్యంచ స్వర్గ్యం స్యాత్తు ఫలోదయే' అని మూలము. విశేషార్థము.-(కరిష్యామి యథార్థంతు) చెప్పఁబడిన యర్థములందు ప్రశంసాదులనుబట్టి యట్లు చెప్పఁబడినదిగాక యథార్థముగనే యుండినది. (కణ్డోర్వచన ముత్తమమ్)వచనము ఉత్తమ మగుట యనఁగా, శరణుఁ జొచ్చినవాఁడు శత్రువైనను రక్షించునపుడు తనకు ప్రాణహాని గలుగనున్నను వానిని రక్షింపవలయునను ఆర్తి గలిగియుండుట, (ధర్మిష్ఠం) వాని వచనానుష్ఠానము ధర్మమును వీడకుండుట. ఆనృశంస్య మను పరమధర్మముతోఁ గూడియుండుట. (యశస్యంచ) లోకులందఱును కొనియాడునట్టి యతిశయము గలిగి యుండునది. (స్వర్గ్యంస్యాత్తు ఫలోదయే) ఫలము నిచ్చుకాలమున స్వర్గము నొసంగఁగూడినది. స్వర్గమనఁగా 'నిరస్తాతిశయాహ్లాద సుఖభావః' అన్నట్లు నిరతిశయ సుఖమైనది. ఇట ప్రతిపాద్యగతమైన ధర్మిష్ఠత్వాదులు ప్రతిపాదక మగువచనమం దుపచరించుచున్నవని తెలియునది.

†ఇట్లు చెప్పఁగా సుగ్రీవుఁడు చక్కఁ దెలియక హృదయము కరఁగకుండుటంజూచి రాముఁడు తన ప్రకృతికిఁదగినట్లు ప్రతిజ్ఞ సేయుచున్నాఁడు. 'సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతిచయాచతే । అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ' అనిమూలము. విశేషార్థము:—(మిత్రభావేన సంప్రాప్తమ్) అనుశ్లోకమున తనప్రకృతిని రాముఁడుచెప్పెను. ఈశ్లోకముచేత ఆప్రకృతి కనుగుణమైన ప్రతిజ్ఞను జెప్పు

చున్నది. 'అథ సోఽభయంగతో భవతి' 'అట్లు బ్రహ్మవేత్తయగువాఁడు అభయమును బొందినవాఁడగును' 'ఆనన్దం బ్రహ్మణో విద్వాన్-నబిభేతికుతశ్చన' 'బ్రహ్మముయొక్క ఆనందము దెలిసినవాఁడు దేనివలనను భయమునొందఁడు' అని అభయమును బ్రహ్మవిద్యకు ఫలముగా శ్రుతిచెప్పుటచే మోక్షమే కావలయును. ఇది 'తవాస్మి' అని ఫలవిశేషమును యాచించుపక్షమునకు అనుకూలమయినది. పక్షాంతరమున, భగవంతుఁడే సకలఫలప్రదుఁడగుటంబట్టి, ఈయభయము మోక్షమునకేకాక త్రైవర్గికములగు ధర్మార్థకామఫలములకును నుపలక్షణ మగుచున్నది. (ఏతద్వ్రతం మమ) ఇది నావ్రతము-ప్రతిమువలె ఎట్టిదశయందుఁగాని విడువఁదగినది గాదనుట, లేక (సర్వభూతేభ్యః) సమస్తప్రాణులకొఱకు-ఎవ్వఁడెవ్వఁడు శరణాగతుఁడగునో జాతిగుణాదిభేదములేక వారి కందఱకు ననుట, లేక శరణాగతుని సంబంధించినవారికిఁగూడ ననుట. (అభయందదామి) అభయమునిచ్చెదను. అట్లు 'పశుర్మనుష్యః పక్షీవా యేచ వైష్ణవసంశ్రయాః। తేనైవతేప్రయాస్యన్తి తద్విష్ణోః పరమంపదమ్' వైష్ణవు నాశ్రయించియున్న పశువులును మనుష్యులును పక్షులుగాని ఏవిగలవో యవియన్నియు నతనితోనె పరమంబగు విష్ణుపదమునొందును' అని చెప్పఁబడియున్నది.

లేక:—'వేదోపబృంహణార్థాయ తావగ్రాహయతప్రభుః' అన్నట్లు ఈప్రబంధము వేదోపబృంహణమునందు తాత్పర్యముగలదిగదా. ఇచ్చట నిది ఏవేదార్థమును ఉపబృంహణము నేయుచున్నది? ఆ వేదవాక్యమేది? అన్నచో 'తంహదేవమాత్మబుద్ధిప్రసాదం ముముక్షుర్వై శరణమహంప్రపద్యే' ముముక్షువగు నేను బుద్ధిని ప్రసాదించు నాదేవుని శరణుఁ జొచ్చుచున్నాను' 'ప్రయతపాణి శ్శరణంప్రపద్యే' 'పరిశుద్ధహస్తుఁడనై శరణుఁ జొచ్చుచున్నాను'. 'స్వస్తిసంబాధేష్వభయన్నో అస్తు' సంకటములందు మనకు అభయము కలుగుఁగాక' అని చెప్పఁబడిన ప్రపత్త్యుపాయవైభవము ఇందు ఉపబృంహణము సేయఁబడుచున్నది. 'ప్రయతపాణిశ్శరణ మహంప్రపద్యే' అనునదియే వేదవాక్యము. 'చరణౌ శరణమహంప్రపద్యే' 'చరణౌగాఢంనిపీడ్య' అనియును చరణములను చేతితో పట్టుకొనునపుడు 'ప్రయతపాణిః' అన్నట్లు శుద్ధహస్తుఁడు గావలయును. అశుద్ధహస్తత యనఁగా 'సర్వాన్ధర్మాన్ పరిత్యజ్య' అనియు 'సర్వధర్మాంశ్చసన్త్యజ్య సర్వకామాంశ్చసాక్షరాన్' అనియు ఉపాయాంతరములనెల్ల విడిచిపట్టుట. దానినే 'ప్రయతపాణిః' అనుట. 'మాంవ్రజ' 'శరణంప్రపద్యే' 'ప్రార్థనామతిశ్శరణాగతిః' అని ఉపాయప్రార్థనారూపమయిన జ్ఞానమును 'శరణంప్రపద్యే' అని చెప్పుచున్నది.

ఈవాక్యమును ఈశ్లోకము ఉపబృంహణము సేసినవిధ మెట్లనఁగా:—'సకృదేవ' అను పదములచే అసకృదావృత్తిని (అనఁగా మాటిమాటికి నావర్తించుటను) అపేక్షించుభక్తిని వ్యావర్తింపఁజేయుటచే సర్వధర్మత్యాగపూర్వకమైన 'ప్రయతపాణిః' అనుపదమును, 'ప్రపన్నాయ' అనుపదముచే 'శరణంప్రపద్యే' అనుపదములును 'తవాస్మీతిచయాచతే' అనుపదములచే 'స్వస్త్యస్తు' అను పదములును, 'అభయందదామి' అనుపదములచే 'అభయమస్తు' అనుపదములనును ఉపబృంహణము సేయుచున్నది.

మఱియు 'ప్రపద్యే' అను ప్రపత్తిసేయు దశయందు 'అహమ్' అని యేకవచనముగానున్నది. ఫలదశయందు 'అభయమ్నః అస్తు' అనుచో 'నః' అని బహువచనముగానున్నది. ఇది యెట్లనఁగువిధ మెట్లన్నచో 'వైష్ణవోనఃకులేజాతః' అనుచో 'ఒకవైష్ణవుఁడని యేకవచనముగాచెప్పి 'తేసర్వేముక్తి మాయాన్తి' 'వారందఱు' అని బహువచనముగాను, 'యేచవైష్ణవసంశ్రయాః। తేనైవతేప్రయాస్యన్తి' అని ఏకవచనబహువచనములుగాను నిట్లు బహుప్రమాణములున్నవి. లోకమునందు ఒకఁడు రాజసేవ

సూక్ష్మస్థూలావస్థలందు విశిష్టుఁడైన బ్రహ్మ మొకఁడే యగుటంబట్టి యతని నిత్యత్వనిర్వికారత్వ ఏకత్వాదులకు బాధకములేమి నిర్వహింపఁబడినది. అట్లె యిచటను 'ధాతుః ప్రసాదాన్మహిమానమీశమ్' అనియు 'తస్మిన్ ప్రసన్నే క్లేశసంక్షయః' అనియు ప్రసాదవిశిష్టుఁ డుపాయముగాను, 'ప్రహర్షయిష్యామి' యనియు 'తృప్తిప్రీతయే' అనియు ప్రీతివిశిష్టుఁ డుపేయముగాను, ఇట్లు ఉపాయోపేయములు ప్రసాదము ప్రీతియను విశేషములచేఁ గలిగినదిగాన విశేషణములచే అభేదమును, వానిచే విశిష్టుఁడై యుండు తనకు ఐక్యమును - అనఁగా ఆరెంటను ఏకభూతుఁడే యగుటను-గ్రహించుటచే భగవంతుఁడే ఉపాయమును ఉపేయమును కాఁగూడును. అనఁగా పూర్వభావియగు కారణమును పశ్చాద్భావియగు కార్యమును ప్రసాదము ప్రీతి అను రెంటివలననే భగవంతునకుఁ గలుగుచున్నదిగాని స్వరూపమునందుఁ గాదు గాన దానిచే భగవంతునకును పూర్వముండి యిప్పుడు లేకుండుటయు, ఇప్పుడుండి పూర్వము లేకుండుటయు ననువిరోధము గలుగదు. కావుననే 'ప్రసాద ముపాయము ప్రీతి ఉపేయము' అనిరె పెద్దలు చెప్పిరి. 'అనన్యసాధ్యే స్వాభీష్టే' అని ప్రపత్తి మొదలయినవానిచే సాధ్యమైనదిగదా మోక్షము. సాధ్యమనఁగా మునుపు లేకుండి పిదప ఉత్పన్నమైనది. 'ఉత్పన్నస్య వినాశయోగాత్' అని ఉత్పన్నమునకు నాశముగలదుగాన ఉపేయమైన భగవత్ప్రాప్తిరూపమగు మోక్షము 'సాధ్యమ్' అనుటంబట్టి ఉత్పన్నమైనదిగాన నశించునదిగానున్నదే! ఇదెట్లు? అన్నచో అది నశింపదు. అది నశింపకుండుటకు రెండు ప్రకారములు గలవు. అందొక ప్రకార మెట్లన-సాధ్యము- ఉత్పాద్యము, ప్రాప్యము, వికార్యము, సంస్కార్యము అని నాలుగువిధములై యుండును. వానిలో ఉత్పాద్యమనఁగా 'ఘటంకరోతి పటంకరోతి' అన్నట్లు కుండవలెను గుడ్డవలెను మునుపులేకయే పిదపఁ గలుగునది. ప్రాప్యమనఁగా 'గ్రామంగచ్ఛతి రాజానంగచ్ఛతి' 'గాందోగ్ధి పయః' 'ఆవును పాలుపిదుకుచున్నాఁడు' అన్నట్లు గ్రామము రాజు పాలు మొదలయినవానివలె మును పె సిద్ధమై యుండువస్తువును అధికారికిచ్చుట. వికార్యమనఁగా 'క్షీరమభ్యఙ్క్షయతి' పాలునకు చేమిరి పెట్టుచున్నాఁడు. 'త్రపునీసే ఆవర్తయతి' పిత్తళిని సీసమును కరఁగించుచున్నాఁడు. అన్నట్లు, పాలను పెరుఁగు చేయుట సీసమును కరగించుట. సంస్కార్యమనఁగా 'వ్రీహీన్ ప్రోక్షతి' 'వడ్లను ప్రోక్షించుచున్నాఁడు' 'వ్రీహీనవహన్తి' 'వడ్లను దంచుచున్నాఁడు' అని వస్తువును మఱియొక కార్యమున కుపయుక్తమగునట్లు చేయుట. ఇచ్చటను 'బ్రహ్మవిదాప్నోతి పరమ్' అనియు 'పరాత్పరం పురుషముపైతి దివ్యమ్' 'పరంజ్యోతి రుపసంపద్య' అనియు పూర్వమే సిద్ధరూపుఁడై యున్న పరమాత్మను జీవుఁడు పొందుటచే ప్రాప్యము నిత్యమేయగును. ఇదియె మోక్షము సాధ్యమయ్యు నిత్యమగుట కొక ప్రకారము. మఱియొక ప్రకార మెట్లన:—'నిత్యోనిత్యానామ్' అనియు 'అజో హ్యేకః' 'అనియు' 'నహి విజ్ఞాతుర్విజ్ఞాతే ర్విపరిలోపో విద్యతే' అనియు ఆత్మలు నిత్యులగుటచేతను, వీనికి ధర్మములయిన జ్ఞానానందాదులు నిత్యములు నగును. ఇట్టి నిత్యములయిన యాత్మలకు 'తమసా గూఢమగ్రప్రకేతమ్' అనియు 'తయా తిరోహితత్వాచ్చ శక్తిః క్షేత్రజ్ఞసంజ్ఞితా' అనియు ఆత్మస్వరూపమునకు ఆత్మధర్మములకును తిరోధానము గలిగించునది ప్రకృతి సంసర్గము. ఆ సంసర్గము నశింపఁగా 'స్వేన రూపేణాభినిష్పద్యతే' అనియు 'ఆవిర్భూతస్వరూపస్తు' అనియు 'అవబోధాదయోగుణాః' అనియు 'ప్రకాశ్యన్తే నజన్యన్తే నిత్యా ఏవాత్మనోహితే' ఆగుణములు ఆత్మకు నిత్యము లయినవిగాన మఱుఁగుపడియుండి యపుడు ప్రకాశించుచున్నవేకాని యపుడు క్రొత్తగా పుట్టినవికావు. అనియు ఆత్మల స్వాభావికమైన యాకారము ఆవిర్భవించినదేకాని క్రొత్తగా ఉత్పాద్యము కాకపోవుటవలనను ఆత్మలు నిత్యములేకాన పరమాత్మప్రాప్తిరూప మగుమోక్షమును నిత్యమే యగుచున్నది.

అది యట్లుగుఁగాక. ఇచ్చట వేదోక్తమైన ప్రపత్తికి ఉపబృంహణము సేయఁబడుచేని, 'అనామస్త్యపరాధానా మాలయో౽కిఞ్చనో౽గతిః । త్వమేవోపాయభూతో మే భవేతి ప్రార్థనామతిః । శరణాగతిః' అన్నట్టి ప్రపత్తిలక్షణము లభించినదా యన్నచో 'రావణో నామ దుర్వృత్తో రాక్షసో రాక్షసేశ్వరః । తస్యాహమనుజో భ్రాతా విభీషణ ఇతి శ్రుతః' అని రావణసంబంధమువలనను 'భీషయనేస్మ భీరో' అని నామనిర్వచనమువలనను, తనదోషమును మున్నిడుకొనుటచే 'అహమస్య్యపరాధానామాలయః' అన్నయర్థము చెప్పఁబడినది. 'రాజ్యం ప్రార్థయమానశ్చ' అని తనకు రాజ్యము గోరివచ్చినవాఁడై రామునకొక కించిత్కారమును జేయుటకు రానివాఁడగుటచేత 'అకిఞ్చనః' అన్నయర్థము చెప్పఁబడినది. 'త్వాంతు ధిక్కులపాంసనమ్' అని తలుపఁగొట్టిన తోఁబుట్టువు ప్రాపును లేకుండుటచే 'అగతిః' అన్నయర్థము చెప్పఁబడినది. 'భవన్తం శరణం గతః' అనుటచే 'త్వమేవోపాయభూతో మే భవేతి ప్రార్థనామతిః। శరణాగతిః' అన్నయర్థము చెప్పఁబడినది. 'పాదయోశ్శరణాన్వేషీ నిపపాత' అని పాదములందు శరణుగోరి పడినాఁడనుటచే 'పాదేవే౽స్మిన్ ప్రయుఞ్జ్యతామ్' అన్నయర్థము చెప్పఁబడినది. కాఁబట్టి యీలక్షణము చక్కఁగనే సిద్ధించినది. ఆనుకూల్యసంకల్పాదులును సిద్ధించినవోయనఁగా ఆలక్షణమును పుష్కలముగానే యున్నది. 'ఆత్మానం సర్వదారాంశ్చ పురీం చేమాం సరాక్షసామ్।స్వస్తి తే౽స్తు' అని రావణునికి వానిపట్టణమునకు మంగళమును ఆశాసించుటచే ఆనుకూల్యసంకల్పము చెప్పఁబడినదయ్యెను. 'ఉత్పపాత గదాపాణిః' 'గద చేతియందు దాల్చి పైకెగసెను' అని చేత గదయుండఁగా తన్ను పరిభవించినవానిని గొట్టిపోకుండుటవలన ప్రాతికూల్యవర్జనము చెప్పఁబడినది. 'వాలినంచ హతం దృష్ట్వా సుగ్రీవం చాభిషేచితమ్ । రాజ్యం ప్రార్థయమానశ్చ' అని సోదాహరణముగా రాజ్యము నొసంగ శక్తుఁడని నమ్మివచ్చుటచే 'రక్షిష్యతీతి విశ్వాసము' చెప్పఁబడినది. 'భవన్తం శరణం గతః' అనుటచే 'గోప్తృత్వవరణ'ము చెప్పఁబడినది. 'భవద్గతం మే రాజ్యంచ జీవితంచ సుఖాని వై' 'నీయందే నారాజ్యమును జీవితమును సుఖములునున్నవి' అనుటచే అఖిలభరసమర్పణము చేయుటంబట్టి ఆత్మనిక్షేపము చెప్పఁబడినది. 'ప్రణాదశ్చమహానేష తతో౽స్య భయమాగతమ్' 'వీనిధ్వని మిగుల పెద్దదిగానున్నది. కాన వీనికిభయముగలిగియున్నది' అని స్వరము తొట్రుపడుటవలనను, 'శీఘ్రం వ్యాదిశనో రాజన్ వధాయైషాం దురాత్మనామ్' అని రామునియొద్దకు పోనీయక వానరులు నడిమితోవనే తన్నుఁజంపుటకు సుగ్రీవునమతి వేఁడి నిలుచుండుటంబట్టియు 'దైన్యం కార్పణ్యముచ్యతే' అన్న దైన్యరూపమగు కార్పణ్యమును జెప్పఁబడియె. కాఁబట్టి యీలక్షణమును పుష్కలముగానే యున్నది. ఇట్లు పుష్కల లక్షణమయిన ప్రపత్తిని గావించి దీక్షితఫలముగా, కొల్లకుఁబోయి కుప్పయెత్తినట్లు, నేనుండఁగా ఫలాంతరముల నాశపడక మనలనే నమ్మివచ్చినవానికి సకలభయనివృత్తియును జేయవలయును. ఇది నాకు వ్రతమనుచున్నాఁడు:—ఇట్లు అభయప్రదానము సేయుట యెవరికన్నచో (సకృదేవప్రపన్నాయ) సలక్షణమయిన ప్రపత్తిచేసినవానికి, సలక్షణమయిన ప్రపత్తి సేయుట యనఁగా 'సకృదేవప్రపన్నుఁడయి యుండుట' సకృత్తునకు అర్థమేమనఁగా 'అప్రవృత్తిరసకృదుపదేశాత్' అనియు 'అనేక జన్మసంసిద్ధః' అనియు భక్తివలె స్వరూపనిష్పత్తియు ఫలనిష్పత్తియు చిరకాలసాధ్యముగా నుండక 'తద్ద్వయం సకృదుచ్చారో భవతి' అనియు, 'ఉపాయో౽యం చతుర్థస్తే ప్రోక్తశ్శీఘ్రఫలప్రదః' అనియు స్వరూపనిష్పత్తియు ఫలనిష్పత్తియు నొకసారియేయైయుండుట. 'సకృదేవప్రపన్నాయ' అనుచో 'ఏవ' అను అవధారణము ప్రపన్నుఁడేయనియు వానిప్రపత్తి ఒకతూరియే రెండుతూర్లపటకులేదు అనియు అయోగవ్యవచ్ఛేదమా? ప్రపన్నునికే కాని భక్తుఁడు మొదలైన యన్యులకుఁగాదు.

అని అన్యయోగవ్యవచ్ఛేదమా? అని యడుగవచ్చును. ప్రపన్నుఁడేయని యిట యవధారణముగూర్చినచోఁ బ్రపన్నుని అనువదించి, వానికభయప్రదానము చేయుదుననుటయే యిట వాక్యమునకు విధేయము. కాని, ప్రపన్నుఁడో అప్రపన్నుఁడోయని విమర్శించి ప్రపన్నుఁడేయని విధేయముగా నిట నిర్ణయించుట కాదు. కాన ప్రపన్నుఁడేయని యవధారణముచే నిశ్చయింపవలసినది లేదు. మఱియు 'సకృదుచ్చారో భవతి' అనియు 'సకృదేవహి శాస్త్రార్థః' అనియు ప్రపత్తి సకృత్ప్రయోజ్యయై (ఒకసారి ప్రయోగింపఁదగినదై) అసకృత్ప్రయోజ్య (పలుమాఱు ప్రయోగింపఁదగునది) కానేరదు. అసకృత్ప్రయోజ్యయగుటకు నయితియుండినంగదా అది అట్టిది కాదని వ్యవచ్ఛేదించి సకృత్ప్రయోజ్యయేయని యవధారణము చెప్పఁగూడును. కాన ఒకతూరియే రెండుతూర్లు కాదు అని చెప్ప నక్కఱలేదు. కనుక నీయవధారణము అయోగవ్యవచ్ఛేదముగాదు. 'అభయం గతో భవతి' అని అప్రపన్నుఁడయిన భక్తిసహితునకు అభయప్రదానము చేయుటంబట్టి 'వీనికే తప్ప మఱియొకనికి అభయప్రదానము గలుగదు.' అను అన్యయోగవ్యవచ్ఛేదమునుగాదు. ఇట్లు రెండునుగానందున ఇదియే మఱొకటిగాదు అని వ్యావర్తించుటకు మఱియొకటి లేమిచే 'సకృదేవ ప్రపన్నాయ' అనుచో అవధారణము వ్యర్థము. లేక 'సకృత్ + ఏవ' అని కేవలసకృత్తుతో అవధారణమును గూర్చితిమేని యిట 'సకృదేవకుర్యాత్, నాసకృత్' అని ప్రపత్తిస్వరూపమును జెప్పుటయైనను సరే. ఆచెప్పుట లేక యిట ప్రపన్నుని అనువదించి అభయప్రదానములో తాత్పర్యముగా పర్యవసించుటంబట్టి సకృత్తుతోఁ గూర్చినను వ్యర్థమే. ఈయుపపత్తులవలన సకృత్పదము ప్రయోగించుటయు వ్యర్థము. 'సకృదేవాభయం దదామి' అని యిట్లు అన్వయము చేయఁగూడదా యన్నచో ఒకశరీరికి పుట్టఁగలిగిన భయములన్నియు ఒకసారిగానే కూడుకొన్నవై వానియొక్క నివృత్తిని ఒకసారిగానే చేయుట కానేరదు. భూతకాలమందలి భయములు పూర్వమే యనుభవించి యైనవి. భవిష్యత్కాలమందలి భయములు ఇంకను ఉత్పన్నములు కానందున దాని నివృత్తి నిపుడు సేయ శక్యముగాదు. ఇంకను 'దదామి' అని ప్రారంభించినపై పరిసమాప్తినొందని కొన్ని భయములు ఉత్పన్నములు కానందున, మీఁదవచ్చువానినెల్లను రానురాను పోఁగొట్టెద ననువర్తమానమునకును, ఒకసారియె అను సకృత్పదమునకును, వ్యాహతిగలుగును. అభయప్రదానము సేసెడి యాదినము మొదలుకొని రావణవధపర్యంతముగాఁ గలుగుభయములకును పరిహారములకును మితిలేనందునను అనుష్ఠానవిరుద్ధమయినందునను 'సకృత్' 'ఏవ' అనుపదములకు వ్యర్థత కలుగుచున్నదేయనఁగా కలుగదు. ఎట్లనః— రాముఁడు విభీషణుని ప్రపన్నుఁడన్నాఁడు. అందులకు అనుపపత్తిగా సుగ్రీవుఁడు సకృత్ప్రయోజ్యమగు ప్రపత్తిని 'రాఘవం శరణం గతః' అనియు 'భవన్తం శరణం గతః' అనియు 'పాదయోశ్చరణాన్వేషీ నిపపాత' అనియు, మూఁడుమార్లు ప్రపత్తిచేసి ప్రపత్తిలక్షణహానియు, ప్రపత్తృస్వరూపహానియు, ప్రపత్తవ్యస్వరూపహానియు చేసినాఁడని దూషణము చెప్పఁగా, రాముఁడు 'సకృదేవ ప్రపన్నాయ' వాఁడు పలుసార్లు చేయలేదు ఒకతూరియే చేసినాఁడనుచున్నారు. 'అయితే నాలుగు మూఁడుమార్లు చేసినట్లుగా చెప్పిన ప్రమాణముల నేమి చేయవలయు' ననఁగా 'రాక్షసోఽభ్యేతి పశ్యధ్వమస్మాన్ హన్తుం ననంశయః' అని యభిశాపమును జెప్పినమిత్తుంజూచి 'సోఽహం పరుషితస్తేన దాసవచ్చావమానితః । త్యక్త్వా పుత్రాంశ్చ దారాంశ్చ రాఘవం శరణం గతః,' అన్నట్లు విరోధియై వచ్చినవాఁడనుగాను. అన్నయే అవమానించి పొమ్మని చెప్పఁగా వానితోడి సంబంధములను విడిచి రాముని శరణుఁజొరవచ్చితిని అని తన స్థితిని జెప్పికొన్నాఁడు మొదట 'శరణం గతః' అని; పిదప మీమాటలచేత నేను కలఁగితినో యని శంకించిన న్నుఁ దెలచివిడుచుటకై 'భవన్తం శరణం గతః' అని విన్నపము చేయుటచే బాధింపువాఁడనై, రాలేదు.

తడిజుట్టుతోను ధౌతవస్త్రముతోను నిలిచినాఁడు? అట్లె విభీషణుఁడును 'యో విష్ణుం సతతం ద్వేష్టి తం విద్యాద న్త్యరేతసమ్' అని విష్ణుద్వేషియై కర్మచండాలుఁడయిన రావణునిగోష్ఠిలోనుండి పోరునపుడు 'ఖస్థఏవ వ్యతిష్ఠత' అని ఆకాశములో నిలిచినాఁడింతేకాని ఏమున్నీటిలోఁ బెన్నేటిలోఁ మునిఁగి వచ్చినాఁడు. 'యదహరేవ విరజేత్ తదహరేవ ప్రవ్రజేత్' ఏనాఁడు విరక్తి పుట్టెనో యానాఁడే యూరువిడిచి పోవలయును. అనియు 'నాస్తి నాక్షత్రసంబన్ధో ననిమిత్తపరీక్షణమ్। శ్రద్ధైవకారణం నిత్య మష్టాక్షరపరిగ్రహే' 'మంచినక్షత్రమా కాదాయని నక్షత్రయోగముచూచుటలేదు. మంచిశకునమా కాదా అని నిమిత్తములను పరీక్షించుటయులేదు. అష్టాక్షరమును పరిగ్రహించువిషయమున శ్రద్ధయె (అనఁగా రుచియే) నిత్యకారణము' అనియు రుచిపుట్టఁగానే వచ్చినాఁడింతే. గంగలో మునుఁగుటకు నొకసముద్రములో మునుఁగవలయునో, 'భగవాన్ పవిత్రం వాసుదేవః' 'పవిత్రమ్' 'పవిత్రాణాం పవిత్రమ్' 'పావన స్సర్వలోకానాం త్వమేవ రఘునన్దన' అని పరమపవిత్రునిగాఁ జెప్పఁబడు నాకడకు, వచ్చువానికి ఒకపురశ్చరణముగాని ప్రపన్నుఁడయినచో నక్కఱలేదు. అనుచున్నాఁడు. "ఇది యెట్లు? భక్తికి శాస్త్రవిహితమైన వర్ణాశ్రమధర్మము లున్నవి. దీనికి 'సర్వధర్మాన్ పరిత్యజ్య' అని ఉన్నధర్మములను విడుమనట్లు చెప్పఁబడియున్నది. కాఁబట్టి ప్రపత్తికంటెను భక్తియే శ్రేష్ఠముగా తోఁచుచున్నదే" యనఁగా అట్లు చెప్పరాదు. 'శబ్దప్రమాణకే హ్యర్థే యథాశబ్దం వ్యవస్థితిః' అని శాస్త్రప్రమాణకములయినచో అది చెప్పినట్లు గ్రహింపవలసినవారము. అనఁగా 'బహవోహి యథామార్గావిశన్త్యేకం మహాపురమ్। తథాజ్ఞానాని సర్వాణి ప్రవిశన్తి తమీశ్వరమ్' అన్నట్లు ఒకయూరికి పోవలసినపుడు, పలుత్రోవ లుండునట్లు, భగవత్ప్రాప్తి పలు ఉపాయములు గలవనిచెప్పి, ఒకయుపాయము తనంతట అశక్తమగుటచే దానికి వేలుకొన్ని సహకారులను శాస్త్రము విధించుచున్నది; ఒకయుపాయము సర్వశక్తియగుటచే దానికి సహకారులు వేలు అక్కఱలేదనుచున్నది. ఈప్రకారభేదమువలన వాని కొండొంటికి వైలక్షణ్యమురాదు. కాని, స్వరూపనిరూపక ధర్మములనియు, నిరూపిత స్వరూపమునకు విశేష నియామకములయిన ధర్మములనియు రెండు తెగలు గలవు. అవిశేషనియామకములను జూడఁగా ప్రపత్తియే విలక్షణ(శ్రేష్ఠ)మైనది. ఎట్లనఁగా 'సోఽన్వేష్టవ్య స్సవిజిజ్ఞాసితవ్యః' అనియు 'బ్రహ్మవిదాప్నోతి పరమ్' అనియు, 'జ్ఞాత్వా దేవమ్ముచ్యతే సర్వపాపైః' అనియు 'తమేవైకంజా నథాత్మానమ్, అన్యావాచో విముఞ్చథ, అమృతస్యైష సేతుః' అనియు 'ముముక్షుర్వై శరణమహం ప్రపద్యే' అనియు భక్తిప్రపత్తులు రెండును వేదాన్తవిహితములుగాను మోక్షాదిసాధనములుగాను నుండుటయందు సమానములే యైనను భక్త్యుపాయ స్వరూపమువలె 'సాధ్యభక్త్యైకగోచరః' అని భగవంతునిచే సాధ్యముగా నుండక ప్రపత్త్యుపాయస్వరూపము, 'సిద్ధరూపం పరంబ్రహ్మ' అనియు 'నిత్యంనిత్యాకృతిధరమ్' అనియు, పూర్వమే సిద్ధరూపమై 'ధ్యాయతే' 'ధ్రువాస్మృతిః' అని స్మృతిసంతానరూపమగు జ్ఞానమై, అచేతనమగుట లేక 'యస్సర్వజ్ఞ స్సర్వవిత్' 'సత్యం జ్ఞానమ్' 'సర్వం సర్వత్ర సర్వదాజానాతి' అని జ్ఞాతయై సదాతనజ్ఞానస్వరూపమై, స్వీకరించునెడల 'ఆవృత్తిరసకృదుపదేశాత్' 'అనేకజన్మసంసిద్ధమ్' అన్నట్లు చిరకాల సాధ్యమయినదిగాక 'తద్ద్వయం సకృదుచ్చారోభవతి' 'ఉపాయభూతో మే భవేతి ప్రార్థనామతి శ్శరణాగతిః' అని సకృత్ప్రయోగము గలదై 'తస్య తావదేవ చిరం యావ దధికారమ్' అని విలంబముగా ఫలము నిచ్చునదిగాక 'ఉపాయోఽయం చతుర్థస్తే ప్రోక్తః శీఘ్రఫలప్రదః' 'తావదార్తి స్తథా వాఞ్ఛా తావ న్మోహ స్తథా సుఖమ్। యావన్నయాతి శరణమ్' అని శీఘ్రఫలప్రదమై 'తపసాఽనాశకేన' అనియు 'యజ్ఞోదానం తపశ్చైవ' అనియు, 'పఞ్చాగ్నయోయేచ తృణాచికేతాః' అనియు 'తపస్స్నాపలబ్ధ

స్తే సోయం ధర్మపరిగ్రహః' అనియు 'కార్యస్త్రిష్వభిషేకశ్చ కాలేకాలేచ నిత్యశః' అనియు వాన దెండ యని లేక ఉప్పునీట చప్పనీటను వేడినీటను మంచునీటను తోఁగి నాలుగుప్రక్కలను రలవిాఁదుగాను నిప్పు విసరఁగా నిలిచి క్లేశముపడునట్లు తపస్సు మొదలయినవి చేయుటకాక, 'ఆనన్దో బ్రహ్మ' 'ఆనన్దం బ్రహ్మ' 'కం బ్రహ్మ ఖం బ్రహ్మ' అనియు 'సర్వగన్ధ స్సర్వరసః' అనియు, సుఖరూపమైనదై 'మిథ్యాప్రయుక్తో యజమానం హినస్తి' 'తప్పఁగా ప్రయోగముచేసినయెడల యాగకర్తను హింసించును' 'జ్ఞానదోషపరిభ్రష్ట శ్చణ్డాలీంయోనిమాగతః' 'జ్ఞానమందలిదోషముచే పరిభ్రష్టుఁడై చండాలయోనిం బుట్టువచ్చును' అన్నట్లు రవ్వంతతప్పుపడినయెడల కర్తను నశించునట్టిదియుఁగాక, 'యథాతథావాసి సకృత్కృతోఽఞ్జలిః। తదైవముష్ణాత్యశుభాన్యశేషతః।శుభానిపుష్ణాతినజాతుహీయతే' అనియు ఎట్లోయొకయట్లు ఒకసారిచేసినయంజలి యప్పుడే అశుభములనన్నింటిని హరించుచున్నది. శుభములను వర్ధిల్లఁజేయుచున్నది. మఱియొకప్పుడును క్షీణింపదు' అనియు 'దురాచారోపిసర్వాశీ కృతఘ్నోనాస్తికః పురా। సమాశ్రయేదాదిదేవం శ్రద్ధయాశరణంయది। నిర్దోషంవిద్ధితంజన్తుం ప్రభావాత్పరమాత్మనః' అనియు, పద్ధతితప్పిజేసినను దోషములనుబోఁగొట్టిదిద్ది అనుష్ఠాతను ఉజ్జీవింపఁజేయునదై 'అవిద్యయామృత్యుం తీర్త్వా విద్యయాఽమృతమశ్నుతే' 'కషాయపక్తిః కర్మాణి జ్ఞానన్తుపరమాగతిః। కషాయేకర్మభిఃపక్వే తతోఽజ్ఞానంప్రవర్తతే' అనియు 'తద్ధమ్మృత్యుమవిద్యయా' అనియు, తనయుత్పత్తికి ప్రతిబంధకము లగు వానిని నివర్తించునదై 'అన్తవదేవాస్యతద్భవతి' 'నహ్యధ్రువైఃప్రాప్యతే' 'ప్లవాహ్యేతేఅదృఢాయజ్ఞరూపాః' అనియు నశించుచున్నద్రవ్యమే యుపకరణముగాఁగలిగి,నశ్వరమైన క్రియారూపమై, తనంతట ఫలమిచ్చుటకు అశక్తమైన దేవతగలదై స్వర్గపశుపుత్రాది ఫలసాధారణముగానుండునట్టి కర్మాదులను అంగముగా అపేక్షించునదిగాక 'తమేవైకంజానథాత్మానమ్ అన్యావాచోవిముఞ్చథ' 'సర్వధర్మాన్పరిత్యజ్య మామేకంశరణంవ్రజ' అనియు 'తదేకోపాయతాయాంతు' అనియు 'మామేవైష్యసి' యనియు, సృష్టియందు మూఁడువిధములయిన కారణములును దానేయైనట్లు ఆత్యన్తికప్రళయమైన మోక్షమందును, అంగమును అంగియును ఉపాయమును ఉపేయమును ఒకటియై, యెల్లవారికి ముక్తి కలుగుట వైషమ్యము నైర్ఘృణ్యము మొదలగుదోషములు రాకుండుటకుఁగాను అధికారిస్వరూపయోగ్యతను గలిగించుటకు వలయు ఆనుకూల్యసంకల్పాదిమాత్రముల నపేక్షించునదియై, యిటువంటి యనేకగుణ పౌష్కల్యములవలన భక్తికంటెను ప్రపత్తియే మిక్కిలియు విలక్షణమగుచున్నది. ఇటువంటిప్రపత్తిని చేసినవానికి, (ప్రపన్నాయైవ) 'మన్త్రివ్యూహే నయేచారే యుక్తోభవితుమర్హతి'! అని కర్మయోగనిష్ఠులయిన మీకును నేనుగాను'జామ్బవాంస్త్వథసంప్రేక్ష్య శాస్త్రబుద్ధ్యావిచక్షణః'అని జ్ఞానయోగనిష్ఠులయిన జాంబవంతునకును నేనుగాను 'భక్తిశ్చనియతా వీర' అని భక్తియోగనిష్ఠుఁడయిన హనుమంతునకును నేనుగాను 'రాఘవంశరణంగతః' అని ప్రపన్నుఁడయిన విభీషణునికే యగుదును. (ప్రపన్నాయైవ) 'అకారార్థాయైవ' అన్నట్లు వాఁడు నాకేయైయుండునట్లు నేనును ప్రపన్నునకే కానుసిపవాఁడ నగుదును.

వాఁడు ప్రపన్నుఁడగుట క్షుద్రప్రయోజనమునకేకదా? 'రాజ్యంప్రార్థయమానశ్చ బుద్ధిపూర్వమిహాగతః' అని మీహనుమంతుఁడేకదా చెప్పినాఁడు అనఁగా, (తవాస్మీతిచయాచతే) అనన్యప్రయోజనుఁడైయే వచ్చినాఁడుసుమీ యనుచున్నాఁడు. అనఁగా చకారము అవధారణార్థకము. విభీషణుఁడు దూతవధము కూడదని తనకుఁ జేసినయుపకారమునకు ప్రత్యుపకారముగా రాజ్యమియ్యవలయునని హనుమంతుఁడు చెప్పినాఁడింతేకాని విభీషణుఁడు చెప్పినాఁడో?'నదేవలోకాక్రమయభిప్రాయముతో

ణం నామరత్వం మహం వృణే। ఐశ్వర్యం వాపి లోకానాం కామయే నత్వయా వినా’ ‘నీవులేని దేవలోకము కలుగుటగాని దేవత్వముగాని కోరను. లోకములకెల్ల నీశ్వరుఁడై యుండుటగాని నా కిష్టముగాదు.’ అని లక్ష్మణుఁడు చెప్పినట్లు, ‘త్యక్త్వా పుత్రాంశ్చ దారాంశ్చ’ అనియు ‘పరిత్యక్తా మయా లఙ్కా మిత్రాణి చ ధనాని చ। భవద్గతం మే రాజ్యం చ జీవితం చ సుఖాని వై’ అనియు బాహ్యబంధములు దెగనాడి స్త్రీలు వస్త్రములు మహదైశ్వర్యము మంచిపుత్రికలు తలితండ్రులును నేనేయని వచ్చినవాఁడు. (తవాస్మీతి చ యాచతే) ‘తవైవాస్మ్యహమచ్యుత’ ‘కృష్ణా! నీవాఁడనేయగుదును’ అన్నట్లు అనన్యప్రయోజనుఁడై యె వచ్చినవాఁడు, (తవాస్మి) ‘నమమ’ ‘నరావణస్య’ నావాఁడనుగాను గాన స్వాతంత్ర్యమును లేదు. రావణునివాఁడనుగాను గాన పారతంత్ర్యమును లేదు. నాకు పరతంత్రుఁడై యుండుటయే స్వరూపమని వచ్చినవాఁడు (తవైవాస్మి) వాఁడు నన్నుఁజూచి ‘తవైవాస్మి’ ‘నీవాఁడనేయగుదును’ అన్నాఁడు. నేనును ‘భుక్త్వా చ భోగాన్ విపులాం స్తతో న్తేమత్ప్రసాదతః। మమానుస్మరణం ప్రాప్య మమలోకం సగచ్ఛతి’ అనియు లంకారాజ్యమును కైంకర్యసామ్రాజ్యమును ‘తవైవాస్తు’ ‘నీవియే యగుఁగాక’ యనియు చెప్పఁగలవారము. ‘శ్రీమతా రాజరాజేన లఙ్కాయామభిషేచితః’ అనియు ‘విభీషణాభిధేయం హి లఙ్కైశ్వర్యమిదం కృతమ్’ అనియు ‘లబ్ధ్వా కులధనం రాజా లఙ్కాం ప్రాయాద్విభీషణః’ అనియు నిట్లు, రెండును నిచ్చివైచినాఁడుగదా. కులధనమనఁగా కోశలాధ్వారము సూచించుట యెట్లనఁగా ‘ఇదం విమానమాశ్చర్య మిక్ష్వాకుకులదైవతమ్’ అనియు ‘మనువంశప్రసూతానాం క్షత్రియాణాం కులసంధనమ్। కామగం కామదం కాన్తం విమానం రఙ్గసంజ్ఞితమ్’ అనియు ఉపపురాణమందును బ్రహ్మాండపురాణమందును స్పష్టమైనదానిని నిచ్చుట ననుపదించుటచే కొంతఁ దెలియఁగలుగదు. (తవాస్మి) ‘స్థిరమాత్మని శేషత్వమ్’ అనియు ‘స్వత్వమాత్మని సఞ్జాతమ్’ అనియు ‘ఆత్మదాస్యమ్’ అనియు, ఆత్మను సత్తయుండునప్పుడే శేషముగాఁగదా యుండునది. (తవాస్మి) ‘అహం బ్రహ్మాస్మి’ అనునట్లు సామానాధికరణ్యముచేఁ జెప్పినను, శేషి శేషభావము సిద్ధించునుగదా. అట్లు చెప్పక ‘తవాస్మి’ అని వ్యధికరణముగా చెప్పుట యేలన సామానాధికరణ్యమువలన జీవాత్మలకు పయికి స్వరూపైక్యము తోఁచుటచే భ్రమము కలుగుననియు, ఐక్యము లేదని పూర్వాపరములవలనను ప్రమాణాంతరములవలనను ఉపపాదింపవలసివచ్చుననియుఁ దలఁచి జీవపరమాత్మభేదమును వ్యక్తముగాఁ దెలియునట్లు చెప్పఁబడెనని తెలియునది.

(ఇతి) ఈశ్లోకము రసవంతముగాఁ దోఁచుటచే ‘తవాస్మి’ అన్నప్రకారము చెప్పుచున్నదే యని దానినే యనువదించి ప్రీతుఁడగుచున్నాఁడు. (ఇతి) ‘ఇత్యాహామాల్యోపజీవనః’ అన్నట్లు, ఎవరైన చెప్పవలసినశ్లోకమును ఎవరు చెప్పుచున్నారు? పులస్త్యపులహాదులు ఇతిహాసముగా చెప్పను సినశ్లోకమును ఒకరాక్షసుఁడు చెప్పెడినే.

(చ) ఉపాయమాత్రమును అపేక్షించి విడువక ఫలమునుగూడ గోరవలయునని సముచ్చయార్థకము నగును. (తవాస్మీతి చ) ‘చతుర్విధా భజన్తే మాం జనాః’ అని ఫలచతుష్టయమునకు సాధారణముగానుండు యుపాయమును అపేక్షించినయెడల ఉపేయములందు త్రివర్గమును (ధర్మార్థకామములను) అపేక్షింపక పరమపురుషార్థమగు మోక్షమును అపేక్షించునది (తవాస్మీతి చ) పూర్వార్థమందు ఉపాయము నపేక్షించి శరణాగతుఁడైపోవక ఉత్తరార్థమందు కైంకర్యమునుగూడ నపేక్షించి ద్వయనిష్ఠుఁడగుటయే యగును. (తవాస్మీతి చ) ‘తవాస్మీత్యపి’ అనుట. అనఁగా ‘పరిపాలయ నో రాజన్ వధ్యమానాన్ నిశాచరైః’ అన్న ఋషులవలెను ‘త్రాతుకామ ఇమం లోకం సర్వం వై విచచార హ’ ‘త్రీన్ లోకాన్ సంపరిక్రమ్య తమేవ శరణం గతః’ అన్న జయంతునివలె (కాకాసురునివలె)ను క్షుద్రశరీరరక్షణమునకుఁ గోరక స్వరూపానురూ

పమైన పురుషార్థమగు నన్ను అనుట. స్వరూపానురూపమైన పురుషార్థము '[illegible]' అనియు, 'సహవైదేహ్యా అహంసర్వం కరిష్యామి' యనియు, ఇష్టముగానుండు [illegible] కదా. ప్రత్యేకముగానున్న నీకు శేషమైనయెడల 'ఏకాయనుఁడుగాఁడా' యనఁగా '[illegible]' అనుచోట, 'మాత్రాచపరిత్యక్తః' అని అనుక్తసముచ్చయమైనట్లు, (చెప్పఁబడకున్న దానిని [illegible]ట్లు) ఇచటను 'తవాస్మితిచ' అనుట 'వైదేహ్యాచాస్మి' అని అనుక్తసముచ్చయమగునుగాన [illegible]యమంటేచుమీ విభీషణుఁడు శరణుఅపేక్షించినది. ఇదిగాక, మీవలె శాఖా[illegible] [illegible] సంచరించుటలేక 'అగ్నిహోత్రాశ్చవేదాశ్చ రాక్షసానాం గృహేగృహే। శ్రుత్వా [illegible]శ్చ విరాత్రేబ్రహ్మరక్షసామ్' అని గృహములోపల (వేద) శాఖాసంచా[illegible]. అనఁగా 'శ్రద్ధయాదేవో దేవత్వమశ్నుతే' అనియు '[illegible]' అ[illegible] '[illegible] ఆహం భాస్కరేణ ప్రభాయథా' అనియు జీవి జీవునకు అపృథక్సిద్ధనిత్యధర్మమై [illegible]దని తెలిసి చెప్పినాఁడనియు గ్రాహ్యము.

ఇదియంతయుఁ దెలిసియున్న వీఁడు, పరతంత్రుఁడై నీవుచేసినట్లు చూచుచుండుట [illegible] యుండఁగా నిన్ను నిర్బంధించుట యొప్పునా? యనఁగా (యాచతే) [illegible] కేట్లుయాచించినాఁ డింతేకాని మఱి నిర్బంధముకాదు. (యాచతే) '[illegible]' అనియు 'అ[illegible]తో......జజ్ఞే' అనియు అట్లు యాచించుటనే నేను పెద్దగాపాటించియుండుటంబట్టి యాచించినాఁడు, (యాచతే) 'సదాహమైకాన్తికనిత్యకింకరః ప్రహర్షయిష్యామి' అనియు ప్రార్థించుచున్నాఁడు. వాని కన్నగుంతలును ప్రలాపమునుజూడఁగా ఎవనికి వారింప మనసువచ్చును.

ఇట్లగునేని వానికిచేయ ననుగ్రహించియుండువదేమి? యనఁగా (అభయం[illegible]) 'అ[illegible] భయఙ్గతోభవతి' అన్నట్లు చేయుదును. (అభయమ్) ఇట 'అ' [illegible], [illegible], [illegible] చూపుచున్నది. కాఁబట్టి, [illegible] (భయమునకన్య) మైన మంగళములను నిచ్చును; [illegible] (భయాభావ)మైన [illegible]లేమినిజేయును. పరులుచేయనున్న ఆపత్తునుగుఱించిన చింతిలేకదా భయము. [illegible] [illegible] భుజబలరంజితులయిన యాపరులచే చేయంబడు నుపకారసంతుష్టిగలవానినిగాఁ జేయుదును. (అభయమ్) 'అతీతేశోకః' 'వర్తమానేవ్యథా' 'ఆగామినిభయమ్' అనికదా లక్షణము. కాఁబట్టి [illegible] ఒక యనర్థమును రాకుండునట్లు చేయుదును.

ఎవ్వరివలననుండి భయమును నివర్తింపఁజేయుట? యనఁగా, (సర్వభూతేభ్యః) [illegible] అచిత్తుతోడి సంసర్గముగలచిత్తులు. అనఁగా దేవతలు తిర్యక్కులు మనుష్యులు స్థావరములనియుండు[illegible]. ఇవియన్నియును బాధింపనట్లుచేయుదును. (సర్వభూతేభ్యః) రావణునివలన [illegible] తప్పుఁడని యింద్రాదులవలన నచ్చుభయమును, నాయందలి యభినివేశముచే 'వధ్యతామ్' అని [illegible] [illegible]లయిన మీచేతఁ గలుగుభయమును, రావణునివిజయమువలన అవమానితులయిన మరుత్తుఁడు [illegible] మనుష్యరాజులవలనఁ గలుగుభయమును, పిడికిటితోనే పెకలింపఁబడిన స్థావరమగు కైలాసము [illegible]నఁగలుగు భయమును, ఈభయములనెల్ల పరిహరింతును. (సర్వభూతేభ్యః) '[illegible]' అనియు '[illegible]' అనియు ప్రక్రియంబట్టి పృథివ్యాదిభూతములకార్యమైన శరీరేంద్రియ విషయాదులు బాధించినను పరిహరింతును. (సర్వభూతేభ్యోఽభయం[illegible]) '[illegible] [illegible]లం పరివర్తయామి' 'జగత్తును కొండలతోడ తలక్రిందుచేసెదను' 'క్షిపామి' 'జగత్తునెల్ల సముద్రమునంద్రోసెదను' 'నక్షమామి' 'నాభక్తుని బాధించినవానిని ఎంతమాత్రమును మన్నింపను' అని నావల

నఁ గలుగుభయమును, హిరణ్యరావణాదులయిన తండ్రులు అన్నదమ్ములు మొదలగువారివలనఁ గలుగుభయమును పోఁగొట్టెదను. (సర్వభూతేభ్యః) 'సర్వపాపేభ్యః' అనియచేతనములయిన పాపములును, ఆయాపాపముల మూలమున బాధించు జంతువులును, వానిమూలమునఁ గలుగు భయమును సమస్తమును పోఁగొట్టెదను. ఇట్లు 'భీత్రార్థానాం భయహేతుః' అని యిట పంచమీవిభక్తి గ్రహించునది.

ఇదిగాక యిది చతుర్థియునగును. అపుడు ప్రపన్నుఁడై 'తవాస్మీతిచయాచతే' అని శరణాగతుఁడై ఫలార్థియైనవిభీషణుని కొకనికా భయనివృత్తి జేయుట? యనఁగా (ఇతిచ) అను చకారమును ఇటకూర్చి (సర్వభూతేభ్యశ్చ) వానికేకాదు. 'చతుర్భిస్సహరాక్షసైః' అని వానితోఁగూడ వచ్చినవారికిని, వారిని సంబంధించినవారికిని అభయప్రదానము చేయుచున్నాననియు నర్థము. భయనిమిత్తము చెప్పవలదా? యనఁగా అది 'రాఘవేణాభయేదత్తే' అనుచోటనున్నదా? 'భయంభయానా మపహారిణి' అనుచోటనున్నదా? అది తనంతటనేవచ్చును. ఇంతేకాక (ప్రపన్నాయ) అని ప్రపన్నునికిమాత్రమా భయనివృత్తిచేయుట? భక్తినిష్ఠులకును పురుషకారనిష్ఠులకును లేదో? అనఁగా (సర్వభూతేభ్యః) భక్తినిష్ఠులని పురుషకారనిష్ఠులని వాసి లేక 'అస్తిబ్రహ్మేతిచేద్వేద సన్తమేనంతతోవిదుః' అని భగవజ్జ్ఞానమునంన సత్తనుబొందినవారి కందఱికిననుట. ఇట్లు సంచిమొదలుగల విలక్షణాధికారులకో యియ్యననధరించుట యనఁగా పలుమాటలేల? (సర్వభూతేభ్యః) విలక్షణోపాయనిష్ఠులు కానక్కఱలేదు. అతిప్రసంగము రాకుండునట్లు 'భవద్విషయవాసినః' అని మాయెల్లకులోపల నుండుటయేచాలును 'యదివారావణస్స్వయమ్' అని శత్రుఁడయిన రావణుఁడుగాని 'విభీషణోవా' అని మిత్రుఁడైన విభీషణుఁడుగాని, 'పాదమూలంగమిష్యామి యానహంపర్యచారిషమ్' అని యుదాసీనయైనశబరిగాని, 'అపహాల్పరమాంగతిమ్' అని మృగమైనమారీచుఁడుగాని, 'గచ్ఛలోకానను త్తమాన్' అని పక్షియైనజటాయువునుగాని, 'పాపాణ గౌతమ వధూ సప్రుం . . . హేతుః' అని స్థావరమైన అహల్యాశిలగాని, 'ప్రతిపేదేస్వమాలయమ్' అని జంగమమయిన జయంతుఁడు(కాకాసురుఁడు) గాని, తృణగుల్మవీరుధాదులుగాని 'పితామహపురోగాస్తే' క్రింద నన్నుఁ బొందవలయునని అపేక్షించిన బ్రహ్మాదులనుగాని తారతమ్యములేక బ్రహ్మాది పిపీలికాంతమగు సర్వవస్తువులకు నభయప్రదానము చేయుచున్నాననుట.

వీరలకుఁ జేయ నవధరించునదేమనఁగా (దదామి) త్యాగముగాదు. ఔదార్యముగాదు. ఉపకారముగాదు. దానముగానే చేయుచున్నాను. త్యాగమనఁగా 'కీర్తిముద్దిశ్య యోగ్యాయోగ్యసమర్పణమ్' అని యితరు లపేక్షించినదానిని కీర్తినిగోరి యంజకయిచ్చుట. ఔదార్యమనఁగా 'సర్వవిషయవితరణమ్ ఔదార్యమ్' అనివిషయవైషమ్యమునఁజూడక చన్నుఁబాలుచేఁపునట్లు తనపేరుగానిచ్చుట, ఉపకారమనఁగా 'ప్రత్యుపకారధియాబద్ధకృతిరుపకారః' అని ప్రత్యుపకారమే ప్రయోజనముగా నాసన్నులకిచ్చుట. 'అదృష్టముద్దిశ్య యోగ్య యోగ్యసమర్పణమ్‌దానమ్' అని అదృష్టఫలమును గోరి విలక్షణవిషయమందు విలక్షణపదార్థములను యిచ్చుట. (దదామి) 'మోక్షయిష్యామి' అన్నట్లు 'దాస్యామి' అని కాలవిలంబముచేయను. (దదామి) 'తమేవంవిద్వానమృతఇహభవతి' అన్నట్లు, 'ఉపాసనప్రారంభే మోక్షప్రారంభః' అని వాఁడు మనలనుద్దేశించి మయికితెచ్చినప్పుడే మేమును ఇయ్య నుపక్రమించితిమి. ఈయుపక్రమము ఆత్మయుండునంతకాలము జరుగఁగలది. 'ప్రారబ్ధోఽపరిసమాప్తశ్చ వర్తమానః' 'ప్రారంభింపఁబడి ముగియకుండునదిగదా వర్తమానము. కాఁబట్టి (దదామి) అను వర్తమానము వలన మేమిచ్చుట ప్రారంభింపఁబడినదిగాని యాత్మయుండునంతవు నిచ్చుచునే యుండుటవలన ముగియకుండునని భావము. (ప్రపన్నాయదదామి) 'న్యాసమేషాంతపసామతిరిక్తమాహుః' అనియును 'తేషాన్తు

కొనిరమ్ము. శరణన్నపుడే వానికి నేనభయమిచ్చినదైనది. వాఁడు విభీషణుండయినంగానీ లేక విభీషణవేషము వేసికొని రావణుఁడు తానే వచ్చినవాఁడయినంగానీ, విభీషణుఁడు గాఁడు రావణుఁడని నాకు చెప్పకొఱకును నూరక మరలిరాక యెవఁడుగానుండినను పిలుచుకొనియేరమ్ము' అనెను. వానరేశ్వరుండగు సుగ్రీవుండట్లు రాముఁడు చెప్పినమాటః విని, 'రావణుఁడైనను దోడ్కొనిరమ్ము' అని యెంతటిదుష్టుఁడయినను శరణాగతుని యందతఁడు చూపుసౌహార్దమునకును అభయమిచ్చియు తన్నే (సుగ్రీవునే)పోయి తోడ్కొనిరావలయుననుటచే తాను సమ్మతించిననే విభీషణుని స్వీకరించునట్లు తనయందుఁ జూపిన సౌహార్దమునకును మిక్కిలియాశ్చర్యమునం బురికొని యట్టిసౌహార్దముగల యతిశయమునకు మూలముగా కాకుత్స్థవంశమునఁ బుట్టుకనొందిన యారామునిం జూచి * 'రామా! నీవు ధర్మసూక్ష్మముల నెఱింగినవాఁడవు. లోకముల నెల్ల రక్షించు

స్వనికర్షాదు లక్కఱలేదనితలంచునాచేత, (అభయంద త్తం) శరణు అన్నపుడే అభయము ఇచ్చినదైనది. 'అథసోఽభయంగతోభవతి' నేను స్వీకరించువాఁడగుటకును వాఁడును స్వీకరింపఁబడినవాఁడగుటకును అనుమతియిమ్ము. ఇట్లు రాముఁడు చెప్పఁగావిని ఎట్లు పిలుచుకొనివత్తునని యాకులపాటుతో పిలుచుకొనివచ్చుటకు పోవుచుండఁగా మరల రాముఁడుపిలిచి సమాధానము చెప్పుచున్నాఁడు. (విభీషణోవా రావణస్స్వయంయదివా) విభీషణునిఁగదా తోడితెమ్మన్నదని మరలక రావణుఁడేయైనను పిలుచుకొనిరమ్ము. విభీషణుని స్వీకరించితి మేని 'విభీషణస్తు ధర్మాత్మా' అని ధర్మాత్ముని స్వీకరించుటవలన మనకొకయుత్కర్షము గలుగదు. 'రావణస్యనృశంసస్య' అన్నట్లు ఆనృశంసుని స్వీకరించిననే యుత్కర్షము కలుగును. మఱియు విభీషణుని స్వీకరింపఁగా వానితోడినలుగురే రక్షితులగుదురు. రావణుని స్వీకరింపఁగా లంకలోనివారందఱును రక్షితులగుదురుగాన మనకు పెద్దలాభమగును. (సుగ్రీవ) 'ఏకం దుఃఖంసుఖంచనౌ' అని యిరువురకును సుఖదుఃఖము లొక్కటేగనుక నాకుఁగలుగు నతిశయము మీకును సమానముగాఁ గలుగునుగదా. (యదివారావణస్స్వయమ్) ఎవ్వనిని సంబంధించినవాఁడగుటచే విభీషణునియందెంత శంకకలుగుచున్నదో యట్టిరావణుఁడే వాఁడగుఁగాక! (స్వయం) నీలను మున్నిడుకొని రాక తానుమాత్రమే వచ్చిన రావణుఁడయినను గానీ, లేక (స్వయం) వీఁడు విభీషణుఁడు కాఁడేని కామరూపియగు రావణుఁడే విభీషణవేషము దాల్చివచ్చినప్పటికిని అభయము నేనిచ్చితిని. నీవును 'వీఁడు రావణుఁడే కాని విభీషణుఁడుగాఁడని నాకు తెలుపుటకుఁగూడ మరలి యూరక రావలదు. తోడ్కొనియే రమ్ము' అనియర్థము.

* ఇందులకుమూలము. 'కిమత్రచిత్రంధర్మజ్ఞ లోకనాథసుఖావహ। యత్త్వమార్యప్రభాషేథాః సత్త్వవాన్ సత్పథేస్థితః' విశేషార్థము.—రాముని స్వాభావికకల్యాణగుణగణముల నాలోచించి యివి సహజధర్మములగుటచే రామునియందుఁ జూపట్టుట యొకయాశ్చర్యముకాదని సుగ్రీవుఁడు చెప్పుచున్నాఁడు. (కిమత్రచిత్రమ్) నీవుగాక యితరు లీమాటను జెప్పిననేకదా యాశ్చర్యమగును. నీవు చెప్పితివనఁగా ఆశ్చర్యమా? ఆశ్చర్యముగాదనుటకు మీఁద హేతువులు చెప్పుచున్నాఁడు. (ధర్మజ్ఞ) ధర్మసూక్ష్మతత్త్వములను దెలిసిననీకు ధర్మానుష్ఠానమొకయాశ్చర్యమా? ధర్మములందెల్ల చేయఁదగు శ్రేష్ఠనధర్మము శరణాగతరక్షణమని తెలిసినవాఁడవుగదా. ఇంతమాత్రమా? (లోకనాథ) లోకములకు స్వామివి. భృత్యవర్గమును రక్షించుట స్వామికి ఒకవిచిత్రమా? చిన్నదానిని పెద్దది సాధింపకుండు

స్వామివి, పరులకు సుఖమును గూర్చుటకే యుదయించినవాఁడవు. నీయధ్యవసాయము ప్రశంసనీయము. నీవు సర్వశక్తివి. ధర్మసంస్థాపనమను సన్మార్గమందు స్థిరముగా నెలకొన్నవాఁడవు. ఇట్టినీవు ఇక్లింతయు నొప్పిదముగాఁ జెప్పుటలో నాశ్చర్యమేమున్నదిని? 'నన్నుఁబొగడిదేమి? నీకు మనస్సు గలిగిననేకదా విభీషణుని గ్రహించుట!' యందువా? నీ యంతరాత్మకే కాక తీవ్రదండమునఁ జంపుమన్న నాయీయంతరా

త్మలు చూచుకొననియెడల కొంతఁగలుగునట్టి సర్వనిర్వాహకత్వము గలవాఁడవుగదా. (సుఖావహా) నీనిర్వాహకత్వము దుఃఖనివర్తకమైనదిమాత్రమా? సుఖహేతువుగాఁ గూడఁగదాయున్నది. అవాప్త సమస్తకాముఁడవయ్యును పరప్రయోజనైకపరాయణుఁడై సర్వసుఖకారినగు నీవు శరణాగతులం దును సమాశ్రితులగు మాయందును సుఖకారివగుట యేమివింత! (సత్త్వవాన్) 'త్వయికశ్చిత్ప్రపన్నా నన్మి' 'నీకు కొంతవిపత్తు కలిగె నేని యిఁకనీరితో నాకుఁబనేమి' యన్ననీవు నేను 'వధ్యతాం' 'విభీ షణుని బంధుఁడను' అనఁగా అట్టి నాయందలి ప్రేమమునుగూడఁగడచి 'సత్యజేయమ్' 'విభీషణు' అనునను సందు దృఢాధ్యవసాయము గలవాఁడవుగదా. దృఢవ్రతుఁడైనవానికి ప్రతిపరిపాలనము వింతయా? (సత్త్వవాన్) సత్త్వమనఁగా బలము. సర్వశక్తినగు నీకు సమాశ్రితులభయమును వారించుట యాశ్చ ర్యమా? (సత్పథేస్థితః) అభిమతులయినవారినిగూడ బహిష్కరించి చేయవలయునట్లు శరణాగతరక్షణ మందు స్థిరుఁడవుగదా. ధర్మసంస్థాపనార్థమే యవతరించినవానికి శరణాగతరక్షణమనెడు విశేష ధర్మము ననుష్ఠించుట ఆశ్చర్యముకాదు. శరణాగతరక్షణవిషయమై ధర్మజ్ఞత్వాదులం దేదేనొకటియే చాలియుండఁగా అన్నియును గూడియుండఁగా చెప్పనేల? యనుట. (ఆర్యత్వంప్రభాషేథాః యత్) సహస్రశ్లోకమును నీమాట నీడలోఁ బడునట్లు నీవుచెప్పినదేదియో—అనఁగా 'దోషోయద్యపితస్యస్యా త్' అనియు 'అభయంసర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతమ్మమ' అనియుఁ జెప్పినమాట ఈపూర్వో క్తస్వభావములుగల నీవుచెప్పితివనుట యొకయాశ్చర్యమా? నీవుదప్ప మఱొకరు చెప్పిననేకదా యాశ్చ ర్యమగును. (ఆర్యంప్రభాషేథాః) అని గోవిందరాజాదిపాఠము. సమీచీనముగా చెప్పితివనుట యొక యాశ్చర్యమాయని యర్థము.

*ఇందులకు మూలము. 'మమచాప్యన్తరాత్మాయం శుద్ధం వేత్తి విభీషణమ్।అనుమానాచ్చ భావా చ్చ సర్వతస్సుపరీక్షితః' విశేషార్థము:—'నామాటను నీవు కొనియాడుటచే ప్రయోజనమేమి? నీమనస్సు కోరినను నేకదా వీనిని స్వీకరించుట' యని రాముఁడనఁగా నామనస్సు తేటీనవిషయమందు ఒకకొంతయు కోరనుచున్నాఁడు. (మమచాపి అంతరాత్మా) నీయంతరాత్మయేకాక 'వధ్యతాం తీవ్రదండేన' యన్నట్టి నా యొక్క యీయంతరాత్మయు, (విభీషణం శుద్ధం వేత్తి) విభీషణుని దోషరహితునిగాఁ దెలియుచు న్నది. విభీషణుఁడు శుద్ధుఁడను విషయమందు నాయంతఃకరణగతి యొకటియే ప్రమాణముకాదు. ఇతరప్రమాణములుగూడఁ గలవనుచున్నాఁడు. (అనుమానాచ్చ) నీవును హనుమంతుఁడును జెప్పినయుక్తు లవలనను, (భావాచ్చ) లోపలిభావమును దెలుపు ముఖప్రసాదాదులవలనను, లేక (అనుమానాచ్చ) ముఖ వికారాదిచిహ్నములవలనను, (భావాచ్చ) వీనిమాటలచేతను ధ్వనిచేతను తేటపడిన మనస్సుయొక్క మృదుస్వభావముచేతను, (చ) చకారమువలన నేను 'వధ్యతామ్' అన్నప్పుడును, నీవు 'సత్యజేయమ్' అన్నప్పుడును, హనుమంతుఁడు 'విద్యతేత్వస్యసజ్జ్రిహా' 'వీనిని బరిగ్రహించుటకు నీలున్నది' అన్నప్పుడును ఎక్కువతక్కువలేక ఒకరూపుగానుండుటవలనను, (సర్వతః) ఇట్లు సర్వప్రకారములచేతను, (సుపరీక్షితః) సంశయవిపర్యయములు లేనట్లు పరీక్షింపఁబడినాఁడు. పరీక్షించి పరిశుద్ధుఁడని తెలిసికొంటిననుట.

త్మకుసయితము విభీషణుఁడు పరిశుద్ధుఁడుగానే తెలియుచున్నాఁడు. నాయంతరాత్మను బట్టియేకాదు. హనుమంతుఁడును నీవును జెప్పినయుక్తులను మనస్సునుబట్టియు చ్చ్వముఖవికాసాదిలక్షణములనుంగొని యనుమానించుటంబట్టియు,వీనియార్తధ్వనిచే ప్రకాశితమయిన మృదుస్వభావమునుంబట్టియు, నేను జంపు మన్నపుడును నీవు దిగవిడువనన్నపుడును నొక్కతీరుగానేయున్న వీనియునికింబట్టియు, లోపలను వెలుపలను వీనిని జక్కఁగా పరీక్షించి నైనది. కాఁబట్టి, రాఘవా! *మహాప్రాజ్ఞుండయిన విభీషణుండు శీఘ్రంబున మాతోసాటిగా నొక్కండై యుండుఁగాక. మాకు స్నేహితుండు నగుఁగాక' యనెను. † అంత నరేశ్వరుండగు రాముఁడు సుగ్రీవుఁడు చెప్పిన మాటను

---

*ఇట్లు శుద్ధస్వభావుఁడగుటచేతను మేమందఱును పొందినపెంపును ఇతఁడొకఁడుగూడ పొందగలయు ననుచున్నాఁడు. ఇందులకు 'తస్మాత్ క్షిప్రంసహాస్మాభి స్తుల్యో భవతు రాఘవ। విభీషణోమహాప్రాజ్ఞ స్సఖిత్వం చాభ్యుపైతు నః' అనిమూలము. (తస్మాత్ క్షిప్రమ్) కాఁబట్టి శీఘ్రముగా-'ఆజగామ ముహూర్తేన' అని యితఁడు వచ్చియుండుటవలనను, 'దత్తమస్యాభయంమయా' అని నీవు అభయమిచ్చియుండుటవలనను విలంబమునకు హేతువేలేదు. ఇట్లుండ నావలననే వానిని స్వీకరించు విషయమున విలంబము కలిగినది. ఇఁక నాకు స్థితి తెలిసినపిదప నతనిని చటుక్కన స్వీకరింపవలయునుగాని క్షణకాలమును విలంబముతగదు. (సహాస్మాభిస్తుల్యోభవతు) మమ్ము నెల్ల వారిని కింకరులనుగాఁ గొన్నట్లు ఇతనిని నొకనినిగూడ కింకరునిగాఁగొన నవధరింపవలయును. (సహాస్మాభిః) ఇతనిని కింకరునిగాఁ గొనునప్పుడు ఇతఁడు ప్రధానుఁడుగాను మేమితనికి పరికరములుగాను కైంకర్యముచేయునట్లు స్వీకరింపవలయును. 'సహాయుస్తే ప్రధానే' (రాఘవ) శరణాగతరక్షణము చేయనపుడు స్వరూపము నశించునట్టి వంశమునందుఁ బుట్టినవాఁడవుగదా. (విభీషణః మహాప్రాజ్ఞః) జ్ఞుఁడు అనఁగా 'మనలను ఆకించన్యమే యూఁతగా రాముఁడు స్వీకరించు' ననియుండువాఁడు. ప్రాజ్ఞుఁడనఁగా 'రావణసంబంధమువలని దోషములనుచూడక స్వీకరించు'నని యుండువాఁడు. మహాప్రాజ్ఞుఁడనఁగా 'ఎందఱు అంతరంగులయినను 'వధ్యతామ్' అని తన్నుఁజంపుమన్నను తాను వెనుదీయకయే నన్ను తేటపఱచి స్వీకరించు' నని యుండువాఁడు. ఇట్లు నన్ను ఉన్నరీతిని తెలియునట్టి మహాజ్ఞానముగలవాఁడుగదా, (తుల్యోభవతు) 'నివేదయత మామ్' అని పురుషకారము సేయుటకై యాచింపఁబడిన క్రూరులమగు మాకు పురుషకారత్వము సంపాదించుటకొఱకే నీవెత్తుకొన్న యీప్రయాసము సిద్ధమైనది. ఇఁకమీఁద మే మీపురుషకారవ్యాపారమును జేయుదుము. అనియర్థము. ఇట్లు విభీషణుని పురుషార్థత్వమును వేఁడి వానితో స్నేహము నెఱిఁతమయొక్క పురుషార్థమును వేఁడుచున్నారు. విభీషణుఁడు (నఃసఖిత్వ ఇచ్ఛాభ్యుపైతు) 'సఖాఁ దాసోస్మి' యన్నట్లే నేనుపొందినపెంపు పొందవలయును. మాకు సఖిత్వమును పొందవలయును.' (మహాప్రాజ్ఞః) ఫలమునుసాధించుట కుపయుక్తమైన జ్ఞానముగలవాఁడు. (నః) నాకుమాత్రమేకాదు. ఎల్లవారికిని ఈఫలము సమానమని తెలుపుటకు (నః) అన్నాఁడు.

† ఇందులకు 'తతస్తుసుగ్రీవవచో నిశమ్య త ద్ధరీశ్వరేణాభిహితం నరేశ్వరః। విభీషణేనాశుజగామ సఙ్గమం పతత్రిరాజేన యథాపురన్దరః' అని మూలము.విశేషార్థము.- ఇట్లు సుహృత్తరుఁడయిన సుగ్రీవుఁ డనుజ్ఞ చేసినయనంతరము శరణ్యుఁడగు రామునికి శరణాగతునితోడి సంగమమును జెప్పుచున్నాఁడు. (తత్ సుగ్రీవవచః నిశమ్యతు) ఆసుగ్రీవునిమాటవిని - 'వధ్యతామ్' అన్న సుగ్రీవునిదొక్క అను.

విని, యంత నావానరశ్రేష్ఠుఁడుపోయి తానభయమిచ్చి రమ్మన్నమాట విభీషణున కుంజెప్పి దోడ్కొనిరాఁగా, దేవేంద్రుఁడు గరుత్మంతునితోడంబోలె రాముఁడు శీఘ్రంబునఁ దానే విభీషణునితోఁ గలసికొనెను. ఇది పదునెనిమిదవసర్గము.

---

## రామవిభీషణ సమాగమము; శ్రీరాముఁడు వానర మధ్యమున విభీషణుని లంకకుఁ బట్టముగట్టుట, సముద్రమును దాఁటఁ జింతించుట.

*రఘుకులుండగు రాముఁడభయము నొసంగఁగానే మహాప్రాజ్ఞుండును రావణునితమ్ముండునగు విభీషణుఁడు, ఇష్టసిద్ధికి సంతుష్టుఁడై తనయందు భక్తిగల యనుచరుల

---

కూలమయిన ఆమాటను విన్నపిదప ప్రీతిచేతఁబుట్టిన విశేషము 'తు' శబ్దము తెలుపుచున్నది. (నిశమ్య తత్తు నరేశ్వరః అభూత్) విని యంత నరేశ్వరుఁడయ్యెను. హనుమంతునిమాట విన్నపుడు సద్గుణశాలి యయ్యెను. సుగ్రీవునిమాట విన్నపుడు నరేశ్వరుఁడు అనఁగా సర్వనిర్వాహకుఁడయ్యెను. (హరీశ్వరేణాభిహితం విభీషణేన సఙ్గమమాశుజగామ) సుగ్రీవుఁడు 'విభీషణా! నీకు రాఘవుఁడభయమిచ్చినాఁడు. రామునికడకుఁబొమ్ము' అనిచెప్పినట్టి విభీషణునితోడి సంగమమును శీఘ్రముగాఁ బొందినాఁడు. (హరీశ్వరేణాభిహితమ్) వానరపరికరమును దానును ప్రవేశింపఁజేయను అన్నవాఁడే యిపుడు ఆవానరపరికరమును దానును స్వీకరింపవలయు ననుచున్నాఁడనుట, (ఆశుజగామ) కట్టువిడఁబడ్డ లేఁదూడ తల్లిపొదుగునకు పోయినట్లు చటుక్కున విభీషణునితోఁగలసినాఁడు. సుగ్రీవునిమనసునందలి యానుకూల్యము తిరుగఁబడునేని ఏమిచేయుదునని అతఁడు సమ్మతించినపుడే చటుక్కునఁబోయి కలసికొన్నాఁడనుట. 'సత్యజేయుంకథంచన' ఇత్యాదులచే సుగ్రీవాదివాక్యరూపములగు విరోధులను నిరసించి శ్రీవిభీషణ స్వీకారమును ప్రతిజ్ఞచేసి యెట్లో కష్టముమీఁద సుగ్రీవాదుల మాటలవలనఁ బుట్టిన విలంబము నోర్వలేక త్వరతో రక్షించుటకు తానే పోయి కలసికొన్నాఁడనుట. (ఆశు) ఆశ్రితులతోడి సంశ్లేషమునందు త్వరాతిశయము గలవాఁడనుట, (పురన్దరః పతత్రిరాజేనయథా) ఇంద్రుఁడు తానే గరుత్మంతునితోఁ గలసినట్లు రాముఁడు తానే కలసినాఁడనుట.

*ఇట్లు శరణ్యుఁడగువానికి శరణాగతునితోఁ గలయుట యనెడి ఫలమును జెప్పి యిప్పుడు శరణాగతునికి శరణ్యుని సేవసేయుట యనుపురుషార్థలాభమును జెప్పుచున్నాఁడు. రాముఁడును స్వీకరించి సుగ్రీవుండును సమ్మతించినపిదప విభీషణుఁడు చేసినది చెప్పఁబడుచున్నది. 'రాఘవేణాభయేదత్తేసన్నతోరావణానుజః । విభీషణోమహాప్రాజ్ఞో భూమిం సమవలోకయన్ । ఖాత్పపాతావనింహృష్టో భక్తైరనుచరైస్సహ' అని మూలము. విశేషార్థము.—(రాఘవేణ) శరణాగతరక్షణము లన కౌకయతిశయము గాక సామాన్యముగా కులాగతధర్మముగాఁ గలిగినవాఁడు. రఘుకులము శరణాగతరక్షణమునఁ జేరుగన్నదిగదా. (అభయేదత్తే) స్వాపేక్షితమయిన సర్వభూతాభయము ఇయ్యఁబడఁగా, 'దత్తమస్యాభయంమయా' అన్నమాట జీవించినది సుగ్రీవుఁడు సమ్మతించినపిదపనే యనియర్థము. అంతకుమునుపు అది అసత్ప్రాయమై యుండెననుట. (రావణానుజోవిభీషణస్సన్నతః) రావణునితమ్ముఁడగు విభీషణుఁడు మిక్కిలి వినయవినమితాంగుఁడై, 'నన మేయమ్' అని లోఁబడనని యుండిన రావణునికిఁ దమ్ముండయ్యుండి యితరులు చేపట్టి యెత్తవలయునట్లు రామపాదములందు పడినాఁడుగాయని బుద్ధి

